# శ్రీ వరలక్ష్మీ వ్రత కల్పము

శ్రీ మహాగణాధిపతయే నమః

ఈ శ్రీవరలక్ష్మీ వ్రతకల్పం లోని లక్ష్మీ పూజను వ్రతంనాడే కాకుండా రోజూ ఇంట్లో కూడా చేసుకోవచ్చు. చదువరుల సౌలభ్యం కొరకు మంత్రములను ఎరుపు రంగులోను, శ్లోకములను ఆకుపచ్చ రంగులోను, సంస్కృత వాక్యాలను నీలం రంగులోను, చేయవలసిన విధానమును నలుపు రంగులోను ఉంచాను. మీకు చాలా సులువుగా అర్థంఅవ్వాలంటే రంగుప్రతి ( కలర్ ప్రింట్ ) తీసుకో గలరు.

**ఇది స్త్రీలకు ప్రత్యేక వ్రతము. కానీ దంపతులిరువురు ఆచరించ వలెను. దీర్ఘ సౌభాగ్యము, సత్సంతానము, సిరిసంపదల కొరకు స్త్రీలు విధిగా ఆచరించవలెను. ఈ వ్రతమును చేయువారు శ్రావణ పూర్ణిమకు ముందుగా వచ్చెడి 2వ శుక్రవారం నాడు ఆచరించవలెను. సూర్యోదయానికి పూర్వమేలేచి, కాలకృత్యములు ముగించుకుని మనసులో "అమ్మా! నీ అనుగ్రహము కోరి ఈవరలక్ష్మీ వ్రతమును చేయుటకు సంకల్పిస్తున్నాను. దానికి తగిన అర్హతను, శ్రద్ధను నాకు ప్రసాదించ వలసినది" అని సంకల్పించుకొనవలెను. బ్రహ్మచర్యము వహించి, మిత భుక్తులై, మితముగా మాట్లాడుతూ అమ్మవారినే మనసున స్మరిస్తూ వ్రతమునకు కావలసిన సంభారములన్నీ ఏర్పరచుకొనవలెను. అమ్మవారికి నివేదించుటకు 21 రకముల పిండివంటలు లేదా శక్తి కొలదీ తయారు చేసుకొనవలెను. గృహమునకు ఉత్తర ప్రదేశమున పూజాస్థలమును గోమయంతో అలికి ఐదురంగుల చూర్ణముతో ముగ్గులు పెట్టి, ఆసనము వేసి, నూతన వస్త్రము పరచి, బియ్యము పోసి, చతురస్రముగా చేసి, అందు అష్ట దళ పద్మమును లిఖించి ఆ బియ్యము తూర్పు భాగమున బంగారు లేక వెండి లేక రాగి లేక మట్టితో చేసిన లక్ష్మీదేవి విగ్రహమును ఉంచవలెను. దానికెదురుగా మండప మధ్యములో నీటితో నింపిన రాగి/వెండి కలశమును ఉంచవలెను. మండపమునకు ముందు పళ్లెములో బియ్యము పోసి ఉంచుకొవాలి. పసుపు గణపతిని వేరే పళ్లెములో ఏర్పాటు చేసుకొన వలెను. (ఈ పసుపు గణపతిని ముందే బియ్యములో పెట్టరాదు. పీటలమీద కూర్చున్నతరువాత పెట్టాలి. లేనిచో అనుకున్న వ్రతము ఏదో కారణముతో చాలా ఆలస్యమగును. ) విధిగా శుచి అయిన సాంప్రదాయ వస్త్రములు ( చీర ) ధరించాలి. జుట్టును ముడివేసి ఉండాలి. నుదుటన కుంకుమ ధరించాలి. కాళ్లకు పసుపు రాయాలి. పీటలమీద కూర్చునే ముందు పెద్దల ఆశీర్వాదమును స్వీకరించి కుడికాలు ముందు పెట్టి ఆసనము పై కూర్చొన వలెను. ఆచమనము చేసి,దీపారాధన చేసి, పసుపు గణపతిని బియ్యపు పళ్లెములో ఉంచి, కుంకుమ అలంకరించి పూజను ప్రారంభించ వలెను.**

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం। ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే॥
శ్లో॥ వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థః ప్రతిపత్తయే। జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥
శ్లో॥ గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః। గురు స్సాక్షాత్ పరబ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః॥
శ్రీ గురుభ్యో నమః హరిః ఓం ||

ఆచమ్య। ఓం కేశవాయ స్వాహా । ఓం నారాయణాయ స్వాహా । ఓం మాధవాయ స్వాహా।
ఓం గోవిందాయ నమః। ఓం విష్ణవే నమః। ఓం మధుసూదనాయ నమః। ఓం త్రివిక్రమాయ నమః। ఓం వామనాయ నమః। ఓం శ్రీధరాయ నమః। ఓం హృషీ కేశాయ నమః। ఓం పద్మ నాభయ నమః। ఓం దామోదరాయ నమః। ఓం సంకర్షణాయ నమః। ఓం వాసుదేవాయ నమః। ఓం ప్రద్యుమ్నాయ నమః। ఓం అనిరుద్ధాయ నమః। ఓం పురుషోత్తమాయ నమః। ఓం అధోక్షజాయ నమః। ఓం నారసింహాయ నమః। ఓం అచ్యుతాయ నమః। ఓం జనార్దనాయనమః। ఓం ఉపేంద్రాయ నమః। ఓం హరయే నమః। ఓం శ్రీ కృష్ణాయ నమః॥

## దైవీప్రార్థన :

శ్లో॥యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా। తయో స్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళం॥
శ్లో॥ తదేవలగ్నం సుదినంతదేవ తారాబలం చంద్రబలంతదేవ।
విద్యాబలం దైవబలంతదేవ లక్ష్మీపతే తేంఘ్రియుగం స్మరామి॥
శ్లో॥ యత్రయోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః। తత్ర శ్రీర్విజయో భూతిర్ధ్రువానీతిర్మతిర్మమ॥
శ్లో॥ స్మృతే సకల కళ్యాణ భాజనం యత్రజాయతే। పురుషస్త మజం నిత్యం వ్రజామి శరణం హరిం॥
శ్లో॥ సర్వదా సర్వ కార్యేషు నాస్తి తేషామ మంగళం। యేషాం హృదిస్థో భగవాన్ మంగళాయతనం హరిః॥
శ్లో॥ లాభస్తేషాం జయ స్తేషాం కుతస్తేషాం పరాభవః। యేషామిందీవర శ్యామో హృదయస్థో జనార్దనః॥
శ్లో॥ఆపదామప హర్తారం దాతారం సర్వ సంపదాం। లోకాభిరామం శ్రీ రామం భూయో భూయో నమామ్యహం॥
శ్లో॥ సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే। శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే॥
శ్రీ లక్ష్మీ నారాయణాభ్యాం నమః ।ఉమా మహేశ్వరాభ్యాం నమః। వాణీ హిరణ్య గర్భాభ్యాం నమః। శచీ పురందరాభ్యాం నమః। అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః। శ్రీ సీతా రామాభ్యాం నమః। మాతా పితృభ్యో నమః। సర్వేభ్యో మహా జనేభ్యో నమః।

భూతోచ్చాటన : ( ఈ క్రింది మంత్రము చెప్పి ఆక్షితలను వాసన చూసి వెనుకకు వేయాలి. అందువల్ల మనము చేసే సత్కర్మలకు ఆటంకం కలిగించే భూతములు తొలగి పారిపోతాయి )

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యేతే భూమి భారకాః। యేతేషామవిరోధేన బ్రహ్మ కర్మ సమారభే।।

ప్రాణా యామము : ఓం భూః ।ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం తపః। ఓగ్ం సత్యం। ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। ఓమాపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భు వస్సు వరోమ్।। ( అని మనసులో జపిస్తూ ప్రాణా యామము చేయాలి )

సంకల్పం : ( హైదరాబాద్ లో ఉండే వారికి మాత్రమే ఈ సంకల్పం పనికి వస్తుంది. ఎరుపు రంగులో ఉన్నవి మీరుఉన్న ప్రదేశాన్ని బట్టి మారాతాయి. కనుక మిగతా ప్రదేశాల వారు మీ ప్రాంత పురోహితులని సంప్రదించగలరు )

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం। శుభాభ్యాం శుభే శోభనే ముహూర్తే। శ్రీ మహా విష్ణో రాజయా। ప్రవర్తమానస్య। అద్య బ్రహ్మణః। ద్వితీయ పరార్ధే। స్వేతవరాహ కల్పే। వైవస్వత మన్వంతరే। కలియుగే। ప్రథమ పాదే। జంబూ ద్వీపే। భరత వర్షే। భరత ఖండే। మేరోర్దక్షిణ దిగ్భాగే। శ్రీశైలస్య వాయువ్యప్రదేశే। క్రిష్ణా గోదావర్యోర్మధ్యదేశే। లక్ష్మీనివాసగృహే। సమస్త దేవతా బ్రాహ్మణ హరి హర గురు చరణ సన్నిధౌ। అస్మిన్ వర్తమాన - వ్యావహారిక చాంద్రమానేన - ...................... సంవత్సరే। దక్షిణాయనే । వర్ష ఋతౌ। భాద్రపద మాసే। శుక్ల పక్షే। చతుర్థ్యాం తిథౌ। ........ వాసరే ........... శుభ నక్షత్రే। శుభ యోగే ।శుభ కరణే । ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ తిథౌ।

శ్రీమాన్ .... గోత్రః। .... నామధేయః। ధర్మపత్నీ సమేతః।శ్రీమతి.... గోత్రవతి। .... నామధేయవతి।

శ్రీమతః... గోత్రస్య। ... నామధేయస్య। ధర్మపత్నీ సమేతస్య।శ్రీమత్యాః ...గోత్రవత్యాః। ..నామధేయవత్యాః।

అహం మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరముద్దిశ్య। శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం। అస్మాకం సహకుటుంబానాం క్షేమ స్థైర్య ధైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం। ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం । పుత్ర పౌత్రాభి వృద్ధ్యర్థం ।ఇష్టకామ్యార్థ ఫలసిద్ధ్యర్థం । సమస్త దురితోప శాంత్యర్థం। వర్షే వర్షే ప్రయుక్త శ్రావణ పూర్ణమ్యాం పూర్వ భృగువాసరే। శ్రీవరలక్ష్మీ దేవతాముద్దిశస్య। శ్రీవరలక్ష్మీ దేవతా ప్రీత్యర్థం। శ్రీవరలక్ష్మీ దేవతా సన్నిధౌ సంభవద్భిః ద్రవ్యైః సంభవద్భిరుపచారైః సంభవితా

నియమేన, భవిష్యోత్తర పురాణ కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥

ఆదౌనిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీ మహా గణాధిపతి పూజాం కరిష్యే॥ ( అని చెప్పి అక్షతలు నీరు వదలాలి )

కలశారాధనమ్ :

తదంగ కలశారాధనం కరిష్యే॥ కలశం గంధ పుష్పాక్షతైరభ్యర్చ్య। కలశే ఉదకం పూరయిత్వా। కలశస్యోపరి హస్తం నిధాయ। ( కలశమును నీటితోనింపి గంధ పుష్పాక్షతలతో అలంకరించి, చెయ్యి మూతవేసి, ఆ నీటియందు గంగా మొదలైన సప్తనదులు ఆవాహన అయినట్లుగా భావిస్తూ ఈక్రింది మంత్రం పఠించాలి)

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః। మూలే తత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్మృతాః।

కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోథ యజుర్వేద సామవేదోహ్యథర్వణః।

అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః॥

మం॥ ఆకలశేషుధావతి పవిత్రే పరిషిచ్యతే। ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే॥

ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోన్నమాపో2మృతమాపస్సమ్రాడాపో విరాడాపస్స్వరాడాపశ్ఛన్దాగ్ స్యాపో జ్యోతీ గ్ ష్యాపో యజుగ్ ష్యాపస్సత్యమాపస్సర్వా దేవతా ఆపో భూర్భు వస్సువరాప ఓమ్॥

శ్లో॥ గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి। నర్మదే సింధు కావేర్యౌ జలేస్మిన్ సన్నిధిం కురు॥

ఆయాంతు శ్రీ మహా గణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః। కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య। దేవం ఆత్మానంచ సంప్రోక్ష్య। [కలశములోని నీటిని పూజా ద్రవ్యములయందు, దేవునియందు, తనయందు చల్లుకొనవలెను)

## మహాగణపతి పూజ

ఏపూజ చేసేటప్పుడైనా ముందుగా మహాగణపతి(పసుపు గణపతి)ని పూజించి తరువాత ఆయాదేవతల పూజ చేయాలి. పళ్ళెంలో బియ్యం పోసి అందు పసుపుతో గణపతిని చేసి తమలపాకుపై పెట్టి పూజించాలి.]

సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీ పుత్ర పరివార సమేతం అస్మిన్ బింబే శ్రీమహాగణాధిపతిం ఆవాహయామి। ( అక్షతలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। ధ్యాయామి। ( అక్షతలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। ఆవాహయామి। ( అక్షతలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। ఆసనం సమర్పయామి। ( అక్షతలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। పాదయోః పాద్యం సమర్పయామి।(నీరు గణపతికిచూపి హరివాణంలో వదలాలి)

శ్రీమహాగణాధిపతయే నమః।హస్తయోః అర్ఘ్యం సమర్పయామి। (నీరు గణపతికిచూపి హరివాణంలో వదలాలి)

శ్రీమహాగణాధిపతయేనమః।ముఖేఆచమనీయం సమర్పయామి।(నీరుస్వామికిచూపి హరివాణంలో వదలాలి)

శ్రీమహాగణాధిపతయే నమః। స్నానం సమర్పయామి। (గణపతిపై నీరుచల్లాలి )

శుద్ధ ఆచమనీయం సమర్పయామి। (నీరు గణపతికి చూపి హరివాణంలో వదలాలి)

శ్రీమహాగణాధిపతయే నమః। వస్త్రయుగ్మం సమర్పయామి। ( వస్త్రము/అక్షతలు)

శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

శ్రీమహాగణాధిపతయేనమః। యజ్ఞోపవీతం సమర్పయామి।(యజ్ఞోపవీతం/అక్షతలు)

శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

శ్రీమహాగణాధిపతయే నమః। గంధం సమర్పయామి। (గంధం)

శ్రీమహాగణాధిపతయే నమః। అక్షతాన్ సమర్పయామి। ( అక్షతలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। పుష్పం సమర్పయామి। అక్షతైః పుష్పైః పూజయామి। (అక్షతలు పుష్పాలతో పూజచేయాలి )

ఓం సుముఖాయ నమః। ఓం ఏకదంతాయ నమః। ఓం కపిలాయ నమః। ఓం గజకర్ణకాయ నమః। ఓం లంబోదరాయ నమః। ఓం వికటాయ నమః। ఓం విఘ్నరాజాయ నమః। ఓం గణాధిపాయ నమః। ఓం ధూమకేతవే నమః। ఓం గణాధ్యక్షాయ నమః। ఓం ఫాలచంద్రాయ నమః। ఓం గజాననాయ నమః। ఓం వక్రతుండాయ నమః। ఓం శూర్పకర్ణాయ నమః। ఓం హేరంబాయ నమః। ఓం స్కందపూర్వజాయ నమః।

శ్రీమహాగణాధిపతయే నమః। ధూప మాఘ్రాపయామి। ( ధూపం చూపాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। సాక్షాద్దీపం దర్శయామి। ( దీపం చూపాలి )

శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

శ్రీమహాగణాధిపతయే నమః। నైవేద్యం సమర్పయామి। ( నైవేద్యం సమర్పించాలి )

శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

శ్రీమహాగణాధిపతయే నమః। తాంబూలం సమర్పయామి। ( తాంబూలం )

శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

శ్రీమహాగణాధిపతయే నమః। నీరాజనం దర్శయామి। ( కర్పూర హారతి )

శుద్ధ ఆచమనీయం సమర్పయామి। (అక్షతలు పుష్పాలు పట్టుకుని.... )

శ్లో॥ సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః। లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః॥

ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః। వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబస్కందపూర్వజః॥

షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి। విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా॥

సంగ్రామే సర్వ కార్యేషు విఘ్నస్తస్య నజాయతే॥

శ్రీమహాగణాధిపతయే నమః। మంత్రపుష్పం సమర్పయామి। (ఆ అక్షతలు పుష్పాలు వేయాలి )

శ్రీమహాగణాధిపతయే నమః। ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి। ( అక్షతలు వేయాలి )

అనేన మయాకృతేన షోడశోపచార పూజయా భగవాన్ సర్వాత్మకః శ్రీమహాగణాధిపతి స్సుప్రీత స్సుప్రసన్నో వరదో భవతు। ( అక్షతలు నీళ్లతో హరివాణంలో వదలాలి )

ఉత్తరే శుభకర్మణ్యవిఘ్న మస్త్వితి భవంతో బ్రువంతు। (అనిచెప్తూ పెద్దలకు నమస్కరిస్తే)

ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమస్తు। (అని పెద్దలు పలుకుతూ పూజచేసుకునే వారిపై అక్షతలు వేయాలి)

శ్రీమహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి। (గణపతికి పూజించిన అక్షతలు పుష్పము శిరస్సున ధరించాలి )

శ్రీ మహాగణాధిపతం యధాస్థానం ఉద్వాసయామి। యధాస్థానం ప్రవేశయామి॥ శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ॥ ( అక్షతలు వేయాలి ) మహాగణపతి పళ్లెమును ఉత్తరముగా జరిపి, మళ్లీ ఆచమనము చేసి వరలక్ష్మీ పూజకు సంకల్పించాలి.



## శ్రీ వరలక్ష్మీ పూజ

పుష్పము లేదా తమలపాకు కలశానికి ఆనించి పట్టుకుని ఈ క్రింది మంత్రములతో అమ్మవారిని ప్రతిష్ఠ చేయాలి.

**ప్రాణప్రతిష్ఠ** : ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహనో ధేహి భోగమ్। జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమతే మృళయానస్స్వస్తి। అమృతం వైప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థానముపహ్వయతే।।అస్మిన్ కలశ మధ్యే సాంగం సాయుధం సవాహనం సశక్తిం భత్మ పుత్ర పరివార సమేతం శ్రీవరలక్ష్మీ దేవతాం ఆవాహయామి స్థాపయామి పూజయామి॥ శ్రీ వరలక్ష్మీ దేవతా స్థిరాభవతు। వరదా భవతు। సుప్రసన్నా భవతు। (మనసులో అమ్మా నిన్ను సేవింప దలచి మా గృహమునకు

ఆహ్వానిస్తున్నాను. ఈ కలశము/విగ్రహము నందు నీవు ఆవాహన కావలసినది. అని భావన చేయాలి. ఆ కలశము/విగ్రహము మీద అక్షతలు వేయవలెను)

## 1.అథ ధ్యానం :

శ్లో || పద్మాసనే పద్మకరే సర్వ లోకైక పూజితే| నారాయణ ప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా||

శ్లో॥ క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలా లయే। సుస్థిరా భవమే గేహే సురా సుర నమస్కృతే॥

శ్లో || నమస్తే సర్వ లోకానాం జనన్యై పుణ్య మూర్తయే। శరణ్యే త్రిజగ ద్వంద్వే విష్ణు వక్ష స్థలా లయే॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ధ్యాయామి। (మనసులో అమ్మవారి రూపాన్ని ధ్యానించాలి)

## 2.ఆవాహనం :

మం॥ హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజామ్ |చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ||

శ్లో॥ సర్వ మంగళ మాంగళ్యే విష్ణు వక్షః స్థలాలయే। ఆవాహయామి దేవి త్వాం సుప్రీతా భవ సర్వదా॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ఆవాహయామి। ( అమ్మా నేను నిన్ను పూజించ తలచి మా గృహమునకు ఆహ్వానిస్తున్నాను. నీవు వచ్చి నా పూజను స్వీకరించి నన్ను అనుగ్రహించ వలసినది. అని భావన చేసి ) అక్షతలు కలశము లేదా విగ్రహముపై వేయవలెను. ( ఇక్కడ కలశము అంటే ప్రధాన కలశం. అంటే సత్యనారాయణ వ్రతంలో వలే దేముని పటము ముందు కలశము పెట్టి, దానిపై కొబ్బరికాయను ఉంచి, దానిమీద వస్త్రమును ఉంచుతారు. )

## 3.ఆసనం :

మం॥ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్।

యస్యాం హిరణ్యం విందేయం గామశ్వంపురుషానహమ్॥

శ్లో॥ సూర్యాయుత నిభస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితం। సింహాసన మిదం దేవి స్థీయతాం సురపూజితే॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః నవరత్నఖచిత సువర్ణ సింహాసనం సమర్పయామి। ( అమ్మా! నీవు ఈ ఆసనమును అలంకరించ వలసినది అని భావించి, అమ్మవారిని ఉంచిన ఆసనముపై అక్షతలు చల్లవలెను )

## 4.పాద్యం :

మం॥ అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోదినీమ్ ।శ్రియం దేవీముపహ్వాయే శ్రీర్మా దేవీజుషతామ్॥

శ్లో॥ శుద్ధోదకంచ పాత్రస్థం గంధ పుష్పాది మిశ్రితం। అర్ఘ్యం దాస్యామి తే దేవి గృహాణ సురపూజితే॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః పాదయోః పాద్యం సమర్పయామి। ( అమ్మా! నీ పాదముల కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి) కలశము లోని (ఆచమనం చేసిన పాత్రకాక మరొక పాత్రకు అలంకారం చేశారు కదా అందులోని ) నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదలవలెను.

## 5.అర్ఘ్యం :

మం॥ కాంసోస్మి తాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయన్తీమ్ ।

పద్మే స్థితాం పద్మవర్ణాంతామి హోపహ్వయే శ్రియమ్ ।।

శ్లో॥ సువాసితం జలం రమ్యం సర్వతీర్థ సముద్భవం। పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవనమస్కృతే॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి। ( అమ్మా! నీ హస్తముల కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి, కలశము లోని నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదల వలెను)

## 6.ఆచమనీయం :

మం॥ చన్ద్రాం ప్రభాసాం యశసా జ్వలతీం శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।

తాం పద్మినీమీం శరణ మహం ప్రపద్యే2లక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ।।

శ్లో॥ సువర్ణ కలశానీతం చందనాగరు సంయుతం। గృహాణ ఆచమనం దేవి మయాదత్తం శుభప్రదే॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి। ( అమ్మా! నీ ఆచమనము కొరకు ఈ నీటిని స్వీకరించు అని భావించి) కలశము లోని నీటిని అమ్మ వారికి చూపించి క్రింద పళ్లెములో వదల వలెను.

## 7.స్నానం :

**పంచామృత స్నానం :** (ఈ క్రింది మంత్రములు చదువుతూ " అమ్మా! నీ స్నానము కొరకు ఈ పంచామృతములను, కొబ్బరి నీటిని స్వీకరించు" అని భావించి, పంచామృతములను, కొబ్బరినీటిని అమ్మవారిపై పుష్పముతో కొద్ది కొద్దిగా చల్లవలెను.)

పాలు : మం॥ ఆప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణియం। భవా వాజస్య సంగధే।।

పెరుగు : మం॥ దధిక్రాన్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః। సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగంషి తారిషత్।।

నెయ్యి : మం॥ శుక్రమసి జ్యోతిరసి తేజో సి దేవో వః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోః సూర్యస్య రస్మిభిః।।

తేనె : మం॥ మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః। మాధ్వీర్నస్సంత్వోషధీః। మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః। మధు ద్యౌ రస్తునః పితా। మధుమాం నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః। మాధ్వీర్గావో భవంతు నః।।

పంచదార : మం॥ స్వాదుః పవస్య దివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవేతునామ్నే। స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః।।

కొబ్బరినీళ్లు : మం॥ యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చపుష్పిణీః। బృహస్పతి ప్రసూతా స్తానో ముఞ్చన్త్వగ్ంహసః।।

శ్లో ॥ పయో దధి ఘృతో పేతం శర్కరా మధు సంయుతం।పంచామృత స్నాన మిదం గృహాణ కమలాలయే॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః పంచామృత స్నానం సమర్పయామి।

**శుద్ధోదక స్నానం :** ( కలశములోని నీటిని అమ్మవారిపై చిన్న పుష్పముతో చల్ల వలెను. )

మం॥ ఆదిత్యవర్ణే తపసో2ధిజాతో వనస్పతిస్తవ వృక్షో2థ బిల్వః ।

తస్య ఫలాని తపసా నుదన్తు మాయా న్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ।।

మం॥ ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జే దధాతన। మహేరణాయచక్షసే। యోవశ్శివతమోరస స్తస్య భాజయతే హనః। ఉశతీరివమాతరః। తస్మా అరఙ్గమామవో యస్యక్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః॥

శ్లో || గంగాజలం మయానీతం మహాదేవ శిరః స్థితం। శుద్ధోదక స్నానమిదం గృహాణ విధు సోదరీ ||

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః శుద్ధోదక స్నానం సమర్పయామి।స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి। ( కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను)

## 8.వస్త్రం :

మం॥ ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।ప్రాదుర్భూతో2స్మి రాష్ట్రే2 స్మిన్ కీర్తి మృద్ధిం దదాతు మే॥

శ్లో || సురార్చితాంఘ్రి యుగళే దుకూల వసన ప్రియే। వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ హరి వల్లభే || శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః వస్త్ర యుగ్మం సమర్పయామి। వస్త్ర యుగ్మానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి। (వస్త్రమును గానీ, ప్రత్తితో చేసిన వస్త్రమును గానీ సమర్పించాలి. కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను. )

## ఆభరణం :

శ్లో || కేయూర కంకణై ర్దివ్యై ర్హార నూపుర మేఖలాః। విభూష ణాన్య మూల్యాని గృహాణ ఋషి పూజితే ||

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః నవరత్నమయ ఆభరణాని సమర్పయామి। (ఆభరణాలు గాజులు మొ..వి సమర్పించ వలెను)

## 9.యజ్ఞోపవీతం : మం॥ క్షుత్పిపాసామలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్ ।

అభూతి మసమృద్ధిఞ్చ సర్వాన్నిర్ణుద మే గృహాత్ ।।

శ్లో || తప్త హేమ కృతం సూత్రం ముక్తా దామ విభూషితం। ఉపవీతం మిదం దేవి గృహాణత్వం శుభప్రదే|| శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః స్వర్ణ యజ్ఞోపవీతం సమర్పయామి। యజ్ఞోపవీతానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి।(అమ్మా ఈ యజ్ఞోపవీతమును స్వీకరించు అని భావించి, యజ్ఞోపవీతమును గానీ ప్రత్తితో చేసిన యజ్ఞోపవీతమును గానీ సమర్పించాలి. కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను.)

## 10.గంధం : మం॥ గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।

# శ్రీ వరలక్ష్మీ వ్రత కల్పము

ఈశ్వరీగ్ం సర్వభూతానాం తా మిహోపహ్వయే శ్రియమ్ ||

శ్లో || కర్పూరాగరు కస్తూరీ రోచనాది భిరన్వితం। గంధం దాస్యామ్యహం దేవి ప్రీత్యర్ధం ప్రతి గృహ్యతాం ||

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః దివ్యశ్రీ చందనం సమర్పయామి। హరిద్రా చూర్ణం కుంకుమా చూర్ణం సమర్పయామి॥

( పుష్పముతో గంధమును చల్లవలెను. పసుపు,కుంకుమ సమర్పించవలెను )

**అక్షతాన్** : శ్లో || అక్షతాన్ దవళాన్ దేవి శాలీ యాన్ స్తండులాన్ శుభాన్।

హరిద్రా కుంకుమో పేతాన్ గృహ్యేతా మబ్ధి పుత్రికే ||

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః సువర్ణాక్షతాన్ సమర్పయామి। ( అక్షతలు అంటే క్షతము కానివి. అంటే విరగనివి. )

**పుష్పం** :

మనసః కామ మాకూతిం వాచస్సత్యమశీమహి । పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ||

శ్లో || మల్లికా జాతి కుసుమై శ్చంపకైర్వ కుళైరపి। శత పత్రైశ్చ కల్హారైః పూజయామి హరిప్రియే॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః పుష్పాణి సమర్పయామి। ( పుష్పములు సమర్పించవలెను) అక్షతైః పుష్పైః పూజయామి। (ఇక్కడ 108 లేదా 1008 నామములు జపిస్తూ, కుంకుమ లేదా పూలతో అమ్మవారిని పూజించ వలెను )

**అథ అంగపూజా** :

ఓం చంచలాయై నమః - పాదౌ పూజయామి।

ఓం చపలాయై నమః - జానునీ పూజయామి।

ఓం పీతాంబర ధరాయై నమః - ఊరూ పూజయామి।

ఓం కమలవాసిన్యై నమః - కటిం పూజయామి।

ఓం పద్మాలయాయై నమః - నాభిం పూజయామి।

ఓం మదనమాత్రే నమః - స్తనౌ పూజయామి।

ఓం లలితాయై నమః - భుజ ద్వయం పూజయామి।

ఓం కంబుకంఠ్యై నమః - కంఠం పూజయామి ।

ఓం సుముఖాయై నమః - ముఖం పూజయామి ।

ఓం శ్రియై నమః - ఓష్ఠౌ పూజయామి।

ఓం సునాసికాయై నమః - నాసికాం పూజయామి।

ఓం సునేత్ర్యై నమః - నేత్రే పూజయామి।

ఓం రమాయై నమః - కర్ణౌ పూజయామి।

ఓం కమలాయై నమః - శిరః పూజయామి।

ఓం వరలక్ష్మ్యై నమః - సర్వాణ్యంగాని పూజయామి।

## శ్రీ వరలక్ష్మీ అష్టోత్తర శత నామావళి

ఓం ప్రకృత్యై నమః।

ఓం వికృత్యై నమః।

ఓం విద్యాయై నమః।

ఓం సర్వభూత -

హిత ప్రదాయైనమః।

ఓం శ్రద్ధాయై నమః।

ఓం విభూత్యై నమః।

ఓం సురభ్యై నమః।

ఓం పరమాత్మికాయై నమః।

ఓం వాచ్యై నమః।

ఓం పద్మాలయాయై నమః।10

ఓం పద్మాయై నమః।

ఓం శుచ్యై నమః।

ఓం స్వాహాయై నమః।

ఓం స్వధాయై నమః।

ఓం సుధాయై నమః।

ఓం ధన్యాయై నమః।

ఓం హిరణ్మయై నమః।

ఓం లక్ష్మ్యై నమః।

ఓం నిత్య పుష్టాయై నమః।

ఓం విభావర్యై నమః। 20

ఓం ఆదిత్యై నమః।

ఓం దిత్యై నమః।

ఓం దీప్తాయై నమ।

ఓం వసుధాయై నమః।

ఓం వసుధారిణ్యై నమః।

ఓం కమలాయై నమః।

ఓం కాంతాయై నమః।

ఓం కామాక్ష్యై నమః।

ఓం క్రోధ సంభవాయై నమః।

ఓం అనుగ్రహ ప్రదాయైనమః।

ఓం బుద్ధ్యై నమః।31

ఓం అనఘాయై నమః।

ఓం హరి వల్లభాయై నమః।

ఓం అశోకాయై నమః।

ఓం అమృతాయై నమః।

ఓం దీప్తాయై నమః।

ఓం లోక శోక వినాశిన్యై నమః।

ఓం ధర్మ నిలయాయై నమః।

ఓం కరుణాయై నమః।

ఓం లోక మాత్రే నమః। 40

ఓం పద్మ ప్రియాయై నమః।

ఓం పద్మ హస్తాయై నమః।

ఓం పద్మాక్ష్యై నమః।

ఓం పద్మ సుందర్యై నమః।

ఓం పద్మోద్భవాయై నమః।

ఓం పద్మ ముఖ్యై నమః।

ఓంపద్మనాభప్రియాయై నమః।

ఓం రమాయై నమః।

ఓం పద్మమాలా -
ధరాయై నమః।
ఓం దేవ్యై నమః। 50
ఓం పద్మిన్యై నమః।
ఓం పద్మ గంధిన్యై నమః।
ఓం పుణ్య గంధాయై నమః।
ఓం సుప్రసన్నాయై నమః।
ఓం ప్రసాదాభి ముఖ్యై నమః।
ఓం ప్రభాయై నమః।
ఓం చంద్ర వదనాయై నమః।
ఓం చంద్రాయై నమః।
ఓం చంద్ర సహోదర్యై నమః।
ఓం చతుర్భుజాయైనమః। 60
ఓం చంద్ర రూపాయై నమః।
ఓం ఇందిరాయై నమః।
ఓం ఇందు శీతలాయై నమః।
ఓం ఆహ్లాద జనన్యై నమః।
ఓం పుష్ట్యై నమః।
ఓం శివాయై నమః।
ఓం శివ కర్త్యై నమః।
ఓం సత్యై నమః।
ఓం విమలాయై నమః।
ఓం విశ్వ జనన్యై నమః।70

ఓం తుష్ట్యై నమః।
ఓం దారిద్ర్య నాశిన్యై నమః।
ఓం ప్రీతి పుష్కరిణ్యై నమః।
ఓం శాంతాయై నమః।
ఓం శుక్ల మాల్యాంబర-
ధరాయై నమః।
ఓం శ్రియై నమః।
ఓం భాస్కర్యై నమః।
ఓం బిల్వ నిలయాయై నమః।
ఓం వరారోహాయై నమః।
ఓం యశస్విన్యై నమః। 80
ఓం వసుంధరాయై నమః।
ఓం ఉదారాంగాయై నమః।
ఓం హరిణ్యై నమః।
ఓం హేమ మాలిన్యై నమః।
ఓం ధన ధాన్య కర్త్యై నమః।
ఓం సిద్ధ్యై నమః।
ఓం స్త్రైణ సౌమ్యాయై నమః।
ఓం శుభ ప్రదాయై నమః।
ఓం నృప వేశ్మ-
గతానందాయై నమః।
ఓం వరలక్ష్మై నమః। 90
ఓం వసుప్రదాయై నమః।

ఓం శుభాయై నమః।
ఓం హిరణ్య ప్రాకారాయై నమః।
ఓం సముద్ర -
తనయాయై నమః।
ఓం జయాయై నమః।
ఓం మంగళా దేవ్యై నమః।
ఓం విష్ణు వక్షఃస్థల-
స్థితాయై నమః।
ఓం విష్ణు పత్న్యై నమః।
ఓం ప్రసన్నాక్ష్యై నమః।
ఓం నారాయణ సమాశ్రితాయై
నమః। 100
ఓం దారిద్ర్య ధ్వంసిన్యై నమః।
ఓం దేవ్యై నమః।
ఓం సర్వోపద్రవ వారిణ్యై నమః।
ఓం నవ దుర్గాయై నమః।
ఓం మహా కాళ్యై నమః।
ఓం బ్రహ్మ విష్ణు-
శివాత్మికాయై నమః।
ఓం త్రికాల జ్ఞాన-
సంపన్నాయై నమః।
ఓం భువనేశ్వర్యై నమః। 108

ఓం శ్రీ వరలక్ష్మీదేవతాయై నమః। నానావిధ పరిమళ పత్ర పుష్ప అక్షతాన్ సమర్పయామి॥

11.ధూపం : కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ। శ్రియం వాసయమే కులే మాతరం పద్మమాలినీమ్॥

శ్లో || దశాంగం గగ్గులో పేతం సుగంధంచ మనోహరం। ధూపం గృహాణ కల్యాణి భక్తిత్వం ప్రతి గృహ్యతామ్ ||

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః ధూపం సమర్పయామి। సాంబ్రాణి లేదా అగరుబత్తి చూపించాలి.

12.దీపం : ఆపస్స్రజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే। ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే॥

శ్లో || ఘ్రుతావర్తి సంయుక్తం మంధకార వినాశకం। దీపం దాస్యామి తేదేవి గృహాణ ముదితా భవ॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః దీపం దర్శయామి। ధూప దీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి।

దీపమును చూపవలెను. కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను.

13.నైవేద్యం :

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పిఙ్గళాం పద్మమాలినీమ్। చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ మావహ॥

శ్లో || నైవేద్యం షడ్రసోపేతం దధి మద్వాజ్య సంయుతం। నానా భక్ష్య ఫలోపేతం గృహాణ హరి వల్లభే॥

ఓం భూర్భువస్సువః। తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్। (నైవేద్యము మీద నీళ్లు చల్లాలి) సత్యంత్వర్తేన ( సూర్యాస్తమయం తరువాత అయితే "ఋతంత్వా సత్యేన" ) పరిషించామి। ( అంటూ ఆపదార్థము చుట్టూ నీళ్లు తిప్పాలి) అమృతమస్తు। అమృతోపస్తరణమసి। ( అని ఒక ఉద్ధరిణెడు నీళ్లు అమ్మకు చూపి క్రింద పళ్లెములో వదలాలి ) శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ------------ నైవేద్యం సమర్పయామి। ఓం ప్రాణాయ స్వాహా। ఓం అపానాయ స్వాహా। ఓం వ్యానాయ స్వాహా। ఓం ఉదానాయ స్వాహా। ఓం సమానాయ స్వాహా। ( అని చెప్తూ కళ్లుమూసుకుని నైవేద్యమును అమ్మకు చేతితో తినిపిస్తున్నట్లుగా చూపించాలి. నివేదనకు పూర్ణాలు, పండ్లు, కొబ్బరికాయ, పరమాన్నం, పిండివంటలు, పులగము మొదలగునవి యధాశక్తిగా సమర్పించ వలెను. అమ్మా! నాశక్తి కొలదీ సమర్పించు ఈ నివేదనను స్వీకరించు అని, కళ్లు మూసుకుని అమ్మవారు ప్రీతితో నైవేద్యమును స్వీకరిస్తున్నట్లుగా భావించ వలెను. )

మధ్యే మధ్యే పానీయం సమర్పయామి। అమృతాపిధానమసి। ఉత్తరాపోశనం సమర్పయామి। హస్తౌ ప్రక్షాళ యామి। పాదౌ ప్రక్షాళ యామి। పునరాచమనీయం సమర్పయామి। నైవేద్యము అయిన తరువాత అమ్మవారు చేతులు శుభ్రపరచుకొనుటకు, పాదములు శుభ్రపరచుకొనుటకు, దాహము తీర్చుకొనుటకు కలశంలో నీటిని 5 సార్లు అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను.

**పానీయం**:

శ్లో ॥ ఘనసార సుగంధేన మిశ్రితం పుష్ప వాసితం। పానీయం గృహ్యతాం దేవి శీతలం సుమనోహరమ్॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః పానీయం సమర్పయామి।

**14.తాంబూలం**:

ఆర్ద్రాం యఃకరిణీంయష్టిం సువర్ణాం హేమమాలినీమ్। సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ॥

శ్లో ॥ పూగీ ఫల సమాయుక్తం నాగ వల్లీ దళైర్యుతం। కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం॥ శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః తాంబూలం సమర్పయామి। తాంబూల సేవనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి। ( 3 తమల పాకులు, 2 వక్కలు, పండ్లు తాంబూలముగా సమర్పించవలెను. కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను. )

**15.నీరాజనం** : తామ్మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్।

యస్యాం హిరణ్యం ప్రభూతం గావోదాస్యోఽశ్వాన్ విందేయం పురుషానహమ్॥

శ్లో ॥ నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితం। తుభ్యం దాస్యా మ్యహం దేవీ గృహ్యతాం విష్ణు వల్లభే॥ శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః ఆనంద కర్పూర నీరాజనం సమర్పయామి। నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి। (కర్పూర హారతి వెలిగించి అమ్మవారికి చూపుతూ ఆ వెలుగులో అమ్మవారి దివ్య మంగళ విగ్రహాన్ని దర్శించి, పూలతో-కుంకుమతో అలంకరింపబడిన అమ్మవారి రూపాన్ని మనసులో ముద్రించుకోవలెను. కలశంలో నీటిని అమ్మ వారికి చూపించి పళ్లెములో వదలవలెను)

16.మంత్రపుష్పం : (పుష్పము అక్షతలు పట్టుకుని నుంచుని అమ్మవారిని ఈ క్రింది విధంగా స్తుతించ వలెను)

ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। ధీనామవిత్ర్యవతు॥

వాగ్దేవ్యైచ విద్మహే బ్రహ్మ పత్నీచ ధీమహి। తన్నో వాణీః ప్రచోదయాత్॥

యశ్శుచిః ప్రయతో భూత్వా జుహుయా దాజ్యమన్వహమ్। శ్రియః పంచ దశర్చం చ శ్రీకామస్సతతం జపేత్॥

ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః। ఋషయస్తే త్రయః పుత్రాః స్వయం శ్రీరేవ దేవతా॥

పద్మానసే పద్మ ఊరూ పద్మాక్షీ పద్మసంభవే। త్వం మ్మాం భజస్వ పద్మాక్షీ యేన సౌఖ్యం లభామ్యహమ్॥

అశ్వదాయీ చ గోదాయీ ధనదాయీ మహాధనే। ధనం మే జుషతాం దేవీం సర్వకామార్థసిద్ధయే॥

పుత్రపౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వాజావిగోరథమ్। ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతు మామ్॥

చంద్రాభాంలక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీం। చంద్రసూర్యాగ్ని సర్వాభాం శ్రీమహాలక్ష్మీముపాస్మహే॥

ధన మగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యో ధనం వసుః। ధన మింద్రో బృహస్పతి ర్వరుణం ధన మశ్ను తే॥

వైనతేయ సోమం పిబ సోమం పిబతు వృత్రహా। సోమం ధనస్య సోమినో మహ్యం దదాతు సోమినీ॥

న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభా మతిః। భవంతి కృతపుణ్యానాం భక్తానాం శ్రీసూక్తం జపేత్సదా॥

వర్షంతు తే విభావరి దివో అభ్రస్య విద్యుతః। రోహంతు సర్వబీజాన్యవ బ్రహ్మ ద్విషో జహి॥

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి।

విశ్వప్రియే విష్ణు మనోనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ॥

యా సా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ

గంభీరావర్తనాభి స్తనభర నమితా శుభ్ర వస్త్రోత్తరీయా ।

లక్ష్మీర్దివ్యైర్గజేంద్రై ర్మణిగణ ఖచితై స్స్నాపితా హేమకుంభైః

నిత్యం సా పద్మహస్తా మమ వసతు గృహే సర్వమాంగళ్యయుక్తా॥

లక్ష్మీం క్షీర సముద్ర రాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం

దాసీభూత సమస్త దేవ వనితాం లోకైక దీపాంకురాం ।

శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవ బ్రహ్మేంద్రగంగాధరాం

త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్॥

సిద్ధలక్ష్మీర్మోక్షలక్ష్మీర్జయలక్ష్మీస్సరస్వతీ। శ్రీలక్ష్మీర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా॥

వరాంకుశౌ పాశమభీతిముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థాం ।

బాలార్క కోటి ప్రతిభాం త్రినేత్రాం భజేహమాబాం జగదీశ్వరీం తామ్॥

సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే। శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే॥

శ్లో ।| పద్మాసనే పద్మకరే సర్వ లోకైక పూజితే| నారాయణ ప్రియే దేవి సుప్రీతా భవ సర్వదా||

ఓం మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్నీ చ ధీమహి। తన్నో లక్ష్మీః ప్రచోదయాత్॥

ఓం జాతవేదసే సునవామ సోమ మరాతీయతో నిదహాతి వేదః।
స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సింధుం దురితా2త్యగ్నిః॥ ౧॥
తామగ్నివర్ణాం తపసా జ్వలన్తీం వైరోచనీం కర్మఫలేషు జుష్టామ్।

దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః ॥ ౨॥
అగ్నే త్వం పారయా నవ్యో అస్మాంథ్స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా ।
పూశ్చ పృథ్వీ బహులా న ఉర్వీ భవా తోకాయ తనయాయ శంయోః ॥ ౩॥
విశ్వాని నో దుర్గహా జాతవేదః సింధుంన నావా దురితా2తిపర్షి ।
అగ్నే అత్రివన్మనసా గృణానో2స్మాకం బోధ్యవితా తనూనామ్ ॥ ౪॥
పృతనా జితగ్ం సహమానముగ్రమగ్నిగ్ం హువేమ పరమాథ్సధస్థాత్ ।
స నః పర్షదతి దుర్గాణి విశ్వా క్షామద్దేవో అతి దురితా2త్యగ్నిః ॥ ౫॥
ప్రత్నోషి కమీడ్యో అధ్వరేషు సనాచ్చ హోతా నవ్యశ్చ సత్సి ।
స్వాంచాగ్నే తనువం పిప్రయస్వాస్మభ్యం చ సౌభగమాయజస్వ ॥ ౬॥
గోభిర్జుష్టమయుజో నిషిక్తం తవేంద్ర విష్ణోరనుసంచరేమ ।
నాకస్య పృష్ఠమభి సంవసానో వైష్ణవీం లోక ఇహ మాదయంతాం ॥ ౭॥
ఓం కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి । తన్నో దుర్గిః ప్రచోదయాత్ ॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః సువర్ణ దివ్య మంత్రపుష్పం సమర్పయామి ।

చేతిలోని అక్షతలు, పూలు అమ్మ వారిపై వేయవలెను

**ప్రదక్షిణ నమస్కారం** : (మరల పుష్పము, అక్షతలు పట్టుకుని ఈ క్రిది విధంగా చదువుతూ ఆత్మప్రదక్షిణము చేయవలెను)

యానికానిచ పాపాని జన్మాంతరకృతానిచ, తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే ।

పాపోహం పాప కర్మాహం పాపాత్మా పాపాసంభవః, త్రాహిమాం కృపయాదేవి శరణాగత వత్సలే ।

అన్యధా శరణం నాస్తి త్వమేవశరణం మమ, తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష పరమేశ్వరి ॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।

**సాష్టాంగ నమస్కారం** :

ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తధా । పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగముచ్యతే ॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః సాష్టాంగ నమస్కారాం సమర్పయామి।

( అని చెప్పి సాష్టాంగ నమస్కారం చేయవలెను. అమ్మవారిని మనసులో స్మరిస్తూ, ఆ తల్లి పాదములను మీచేతులు తాకినట్టుగా, ఆ అమ్మ మిమ్ములను ప్రేమతో ఆశీర్వదించినట్టుగా భావన చేయవలయును. పొట్ట, శిరసు, కనులు, మనసు, వాక్కు, పాదములు, చేతులు, చెవులు అను ఎనిమిదింటిని నేలకు తాకునట్లుగా చేసి నమస్కారము చేయుట సాష్టాంగ నమస్కారం. స్త్రీలు మోకాళ్లపై మాత్రమె చేయవలెను. )

**నమస్కారం** : శ్లో॥ నమస్త్రైలోక్య జనని నమస్తే విష్ణు వల్లభే। త్రాహిమాం భక్త వరదే వరలక్ష్మీర్నమో నమః॥

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః నమస్కారం సమర్పయామి।

**అపరాధ నమస్కారము** : ( అమ్మా! మానవులమైన మేము కలి ప్రభావంచేత తెలిసో,తెలియకో ప్రతినిత్యం అనేక అపరాధములు చేస్తూ ఉంటాము. అలా తెలిసీ తెలియక చేసిన అపరాధములను పుత్ర/పుత్రికా వాత్సల్యముతో క్షమించి సదామమ్ము కాపాడు దేవీ..! అనే భావనతో పై శ్లోకములను చదవవలెను )

శ్లో॥ అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం మయా। దాసోయమితిమాం మత్వా క్షమస్వ పరమేశ్వరి॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః అపరాధ నమస్కారం సమర్పయామి।

**తోరగ్రంథి పూజ** : (తొమ్మిది పోగులు, తొమ్మది ముళ్ళు కలిగిన తోరమునకు పసుపురాసి మండపములో తమలపాకుపై ఉంచి ఈ క్రింది విధంగా పసుపు కుంకుమ అక్షతలతో పూజించాలి)

కమలాయై నమః – ప్రథమ గ్రంథిం పూజయామి।

రమాయై నమః – ద్వితీయ గ్రంథిం పూజయామి।

లోకమాత్రే నమః – తృతీయ గ్రంథిం పూజయామి।

విశ్వజనన్యై నమః – చతుర్థ గ్రంథిం పూజయామి।

మహాలక్ష్మై నమః – పంచమ గ్రంథిం పూజయామి।

క్షీరాబ్ధితనయాయై నమః – షష్ఠమ గ్రంథిం పూజయామి।

విశ్వసాక్షిణ్యై నమః – సప్తమ గ్రంథిం పూజయామి।

చంద్రసోదర్యై నమః – అష్టమ గ్రంథిం పూజయామి।

హరివల్లభాయై నమః – నవమ గ్రంథిం పూజయామి।

**తోర బంధనము** :(**ఈక్రింది శ్లోకం చదువుతూ కుడిచేతికి తోరము కట్టుకొనవలెను** )

**శ్లో॥ బధ్నామి దక్షిణే హస్తే నవసూత్రం శుభప్రదం। పుత్రపౌత్రాభి వృద్ధించ సౌభాగ్యం దేహిమే రమే॥**

**వాయన దానము**: ( **ఈక్రింది శ్లోకం చదువుతూ 12 పూర్ణములను వాయనదానం ఇవ్వాలి**)

**శ్లో॥** ఇందిరా ప్రతి గృహ్ణాతు ఇందిరా వైద దాతిచ| ఇందిరా తారకో భాభ్యాం ఇందిరాయై నమో నమః||

**రాజోపచారములు** :

శ్రీ వరలక్ష్మీదేవ్యై నమః ఛత్ర మాచ్ఛాదయామి | చామరం వీజయామి |

గీతంశ్రావయామి | అశ్వానారోహయామి | గజానారోహయామి |

ఆందోళికానారోహయామి। సమస్త రాజోపచార భక్త్యోపచారాన్ సమర్పయామి |

ఛత్రము, చామరము మొదలైనవి సమర్పించాలి. గీతములు ఆలపించాలి. అశ్వములు, గజముల పై ఊరేగించినట్లుగా ( అవి అందరికీ అందుబాటులో ఉండవుకనుక ) భావన చేసి అక్షతలు సమర్పించాలి.

యస్యస్మృత్యాచ నామోక్త్యా తపఃపూజా క్రియాదిషు | న్యూనం సంపూర్ణతాంయాతి సద్యో వందే తమంబికాం||

మంత్ర హీనం క్రియా హీనం భక్తి హీనం మహేశ్వరీ | యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే | |

అనయాధ్యాన ఆవాహానాది షోడశోపచారపూజయా భగవతీ సర్వాత్మికా శ్రీ వరలక్ష్మీ దేవీ సుప్రీతాసుప్రసన్నా వరదా భవతు | (అక్షతలు నీళ్లతో పళ్లెములో వదలాలి)

**వరలక్ష్మీ వ్రత కథా ప్రారంభము** : ( అక్షతలు పట్టుకుని కథ చదువుకోవాలి. )

సూత పౌరాణి కుండు శౌనకుడు మొదలగు మహర్షులను చూచి యిట్లనియె : ముని వర్యులారా స్త్రీలకు సకల సౌభాగ్యములు కలుగునట్టి ఒక వ్రత రాజంబును పరమేశ్వరుడు పార్వతీ దేవికి చెప్పెను. దానిని చెప్పెదను వినుడు.

ఒకప్పుడు కైలాస పర్వతమున వజ్రములు, వైడూర్యములు, మణులు, మొదలగు వాటితో కూడిన సింహాసన మందు పరమేశ్వరుడు కూర్చుండి యుండగా పార్వతీ దేవి పరమేశ్వరునకు నమస్కరించి 'దేవా ! లోకమున స్త్రీలు ఏ వ్రతము చేసినచో సర్వ సౌభాగ్యములు ,పుత్ర పౌత్రాదులు కలిగి సుఖంబుగా నుందురో అట్టి వ్రతము నాకు చెప్పు మనిన ఆ పరమేశ్వరుడు ఈ విధంగా పలికెను. 'ఓ మనోహరీ ! స్త్రీలకు పుత్ర పౌత్రాది సంపత్తులను కలుగ చేసెడి "వరలక్ష్మీ వ్రతము" అను ఒక వ్రతము కలదు. ఆ వ్రతమును శ్రావణ మాస శుక్ర పక్ష పూర్ణిమకు ముందుగా వచ్చెడి శుక్రవారము నాడు చేయవలయును ' అనిన పార్వతీ దేవి యిట్లనియె . 'ఓ లోకారాధ్యా ! నీ వానతిచ్చిన వరలక్ష్మీ వ్రతమును ఎట్లు చేయ వలయును? ఆ వ్రతమునకు విధియేమి? ఏ దేవతను పూజింప వలయును? పూర్వము ఎవరిచే ఈ వ్రతము ఆచరింప బడినది? వీని నెల్ల వివరముగా చెప్ప వలయును ' అని ప్రార్థింపగా పరమేశ్వరుండు పార్వతీ దేవిని చూచి యిట్లనియె - 'ఓ కాత్యాయినీ ! వరలక్ష్మీ వ్రతము వివరముగా చెప్పెదను వినుము. మగధ దేశమున కుండినము అను నొక పట్టణము కలదు. ఆ పట్టణము బంగారు ప్రాకారంబుల తోడను ,బంగారు గోడలు గల ఇండ్ల తోడను గూడి యుండెను.అట్టి పట్టణము నందు చారుమతి యను నొక బ్రాహ్మణ స్త్రీ కలదు. ఆ వనితా మణి పెనిమిటిని దేవునితో సమానముగా తలచి ప్రతి దినమును ఉదయమున మేల్కొని స్నానము చేసి పుష్పములచే పెనిమిటిని పూజ చేసిన పిదప అత్త మామలకు అనేక విధములైన ఉపచారములు చేసి ఇంటి పనులను చేసికొని, గయ్యాళి గాక మితముగాను ప్రియముగాను భాషించుచు నుండెను. ఇట్లుండగా ఆ మహా పతివ్రత యందు మహాలక్ష్మీ దేవికి అనుగ్రహము కలిగి ఒకనాడు స్వప్నంబున ప్రసన్నయై ' ఓ చారుమతీ ! నేను వరలక్ష్మీ దేవిని, నీయందు నాకు అనుగ్రహము కలిగి ప్రత్యక్ష మైతిని .శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చెడు శుక్ర వారము నాడు నన్ను సేవించినచో నీకు కోరిన వరములిచ్చెదను ' అని వచించెను. చారుమతీ దేవి స్వప్నములోనే వరలక్ష్మీ దేవికి ప్రదక్షణ నమస్కారములు చేసి -

శ్లో || నమస్తే సర్వ లోకానాం జనన్యై పుణ్య మూర్తయే|
శరణ్యే త్రిజగ ద్వంద్యే విష్ణు వక్ష స్థలా లయే||

అని అనేక విధముల స్తోత్రము చేసి 'ఓ జగజ్జననీ ! నీ కటాక్షంబు గలిగె నేని జనులు ధన్యులగును, విద్వాంసులుగను , సకల సంపన్నులుగను, నయ్యేదరు. నేను నా జన్మాంతరమున చేసిన పుణ్య విశేషము వలన మీ పాద దర్శనము నాకు కలిగెనని నమస్కరించెను. మహాలక్ష్మి సంతోషము చెంది చారుమతికి అనేక వరములిచ్చి అంతర్ధానంబు నొందెను. చారుమతి తక్షణంబున నిదుర మేల్కొని ఇంటికి నాలుగు ప్రక్కలం జూచి వరలక్ష్మీ దేవిని గానక ' ఓహో ! నేను కలగంటిని ' అని ఆ స్వప్న వృత్తాంతమును పెనిమిటి మామగారు మొదలైన వారితో చెప్పగా , వారు ' ఈ స్వప్నము చాలా ఉత్తమ మైనదని ,శ్రావణ మాసము వచ్చిన తోడనే వరలక్ష్మీ వ్రతమును తప్పక చేయవలసిన 'దని , చెప్పిరి. పిమ్మట చారుమతీ దేవియును ,స్వప్నంబును విన్న స్త్రీలను శ్రావణ మాసము ఎప్పుడు వచ్చునా యని ఎదురు చూచు చుండిరి . ఇట్లుండగా వీరి భాగ్యో దయంబున శ్రావణ మాస పూర్ణిమకు ముందుగా వచ్చెడి శుక్రవారము వచ్చెను. అంత చారుమతి మొదలగు స్త్రీలందరును ఈ దినమే కదా వరలక్ష్మీ దేవి చెప్పిన దినమని ఉదయంబునే మేల్కాంచి స్నానము చేసి శుభ్రమైన వస్త్రములను కట్టుకుని చారుమతీ దేవి గృహమున ఒక ప్రదేశము నందు గో మయంబుచే అలికి మంటపమును ఏర్పరిచి అందు ఒక ఆసనము పైచి దానిపై బియ్యము పోసి కలశం ఏర్పరిచి అందు వరలక్ష్మీ దేవిని ఆవాహనము చేసి చారుమతి మొదలగు స్త్రీలందరూ మిగుల భక్తి యుక్తులై సాయంకాలమున –

శ్లో || పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే|
నారాయణ ప్రియై దేవీ సుప్రీతా భవ సర్వదా ||

అను శ్లోకముచే ధ్యానా వాహనాది షోడశోపచార పూజలను చేసి తొమ్మిది సూత్రములు గల తోరములను దక్షిణ హస్తమున కట్టుకుని వరలక్ష్మీ దేవికి నానా విధ భక్ష్య భోజ్యంబులను నివేదన చేసి , ప్రదక్షిణము చేసిరి .

ఇట్లొక ప్రదక్షిణము చేయగా నా స్త్రీలకందరికి కాళ్ళ యందు ఘల్లు ఘల్లు మను నొక శబ్దము కలిగెను .అంత కాళ్ళను జూచుకొనిన గజ్జెలు మొదలగు నాభరణములు కలిగి యుండ చారుమతి మొదలగు స్త్రీలందరూ 'ఓహో ! ఇవి వరలక్ష్మీ దేవి కటాక్షము వలన కలిగినవి ' అని పరమానందము పొంది మరియొక ప్రదక్షణము చేసిన హస్తములందు ధగ ధగ మెరయు చుండు నవరత్న ఖచితములైన కంకణములు మొదలగు ఆభరణములు ఉండుట చూచిరి.

ఇంక చెప్పనేల ! మూడవ ప్రదక్షణము చేసిన తోడనే ఆ స్త్రీలందరూ సర్వ భూషణ అలంకార భూషిత లయి, చారుమతి మొదలగు ఆ స్త్రీల గృహముల నెల్ల స్వర్ణ మయము లయి, రధ గజ తురగ వాహనముల తోడ నిండి యుండెను. అంత ఆ స్త్రీలను తీసికొని గృహములకు వోవుటకు వారి వారి ఇండ్ల నుండి గుర్రములు ,ఏనుగులు, రధములు, బండ్లును వరలక్ష్మీ దేవిని పూజించు చుండు స్థలమునకు వచ్చి నిలిచి యుండెను. పిదప చారుమతి మొదలగు స్త్రీలందరూ తమకు కల్పోక్త ప్రకారముగా పూజ చేయించిన బ్రాహ్మణోత్తముని గంధ పుష్పాక్షతలచే పూజించి పండ్రెండు కుడుములు వాయన దానంబిచ్చి దక్షిణ తాంబూలముల నొసంగి నమస్కారము చేసి బ్రాహ్మణో త్తమునిచే ఆశీర్వాదంబు నొంది, వరలక్ష్మీ దేవికి నివేదనము చేసిన భక్ష్యాదులను బంధువుల తోడ ఎల్లరును భుజించి, తమ కొరకు వచ్చి కాచుకొని యున్న గుర్రములు, ఏనుగులు, మొదలగు వాహనముల నెక్కి తమ తమ ఇళ్ళకు పోయిరి. అపుడు వారు ఒకరితో నొకరు ' ఆహా! చారుమతీ దేవి భాగ్యంబే మని చెప్ప వచ్చును. వరలక్ష్మీ దేవి తనంతట తానే స్వప్నములో వచ్చి ప్రత్యక్ష మయ్యెను. ఆ చారుమతీ దేవి వలననే గదా మనకిట్టి మహాభాగ్య సంపత్తులు గలిగేను' అని చారుమతీ దేవిని మిక్కిలి పొగడుచు తమ తమ ఇండ్లకు పోయిరి . నాటి నుండి చారుమతి మొదలగు స్త్రీ లందరును ప్రతి సంవత్సరము ఈ వ్రతంబు చేయుచూ పుత్ర పౌత్రాభి వృద్ధి కలిగి ధన కనక వస్తు వాహనముల తోడ గూడుకుని సుఖంబుగ నుండిరి.

కావున ఓ పార్వతీ ! యీ ఉత్తమమైన వ్రతమును బ్రాహ్మణాది నాలుగు జాతులవారును చేయవచ్చును. అటు లొనర్చిన సర్వ సౌభాగ్యములు కలిగి సుఖముగ నుందురు. ఈ కథను విను వారలకు ,చదువు వారలకు వరలక్ష్మీ ప్రసాదము వలన సకల కార్యంబులు సిద్ధించును.

ఇది భవిష్యోత్తర పురాణము నందు పార్వతీ పరమేశ్వర సంవాదమైన వరలక్ష్మీ వ్రత కల్ప కథా సంపూర్ణము.

( కథా అక్షతలు శిరసున ధరించి, బ్రాహ్మణునకు వాయనదానమిచ్చి, ముత్తైదువులను భోజన తాంబూలములచే పూజించవలెను. సాయంత్రము పునః పూజ చేసి, ముత్తైదువులను పిలిచి అమ్మవారి స్తోత్రపారాయణలు చేసి శనగలు,తాంబూలములు ముత్తైదువులకు ఇవ్వవలెను. మరల శనివారము ఉదయము పునః పూజ చేసి అమ్మవారికి ఉద్వాసన చెప్పవలెను. )

**పునః పూజ** : లమిత్యాది పంచోపచారములు

లం పృథ్వీ తత్వాత్మికాయై నమః గంధం పరికల్పయామి। ( గంధం సమర్పించాలి )

హం ఆకాశ తత్వాత్మికాయై నమః పుష్పం పరికల్పయామి। ( పుష్పం సమర్పించాలి )

యం వాయు తత్వాత్మికాయై నమః ధూపం పరికల్పయామి। ( ధూపం చూపించాలి )

రం తేజ స్తత్వాత్మికాయై నమః దీపం పరికల్పయామి। ( దీపం సమర్పించాలి )

వం అమృత తత్వాత్మికాయై నమః అమృతోపహార నైవేద్యం పరికల్పయామి॥ ( నైవేద్యం సమర్పించాలి )

ఉద్వాసన చెప్పేముందు పై పంచోపచారములు చేయాలి. క్రింది మంత్రముతో అమ్మవారిని సాగనంపాలి.

**ఉద్వాసనం :** యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాస్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్।

తేహనాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః॥

ఆవాహనం నజానామి నజానామి విసర్జనం। పూజావిధిం నజానామి క్షమస్వ పరమేశ్వరి॥

శ్రీ వరలక్ష్మీ దేవ్యై నమః యథాస్థానం ప్రవేశయామి॥ శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ॥

ఇక్కడ విచిత్రం చూడండి. "అమ్మా! నిన్ను ఆవాహనం చేయడమూ నాకు తెలియదు, ఉద్వాసన చేయడమూ నాకు తెలియదు, అసలు నిన్ను పూజించడమే నాకు తెలియదు ఏమైనా అపరాధములుంటే క్షమించు తల్లీ." అని పై శ్లోకంలో ప్రార్థిస్తున్నాము. అంటే "ఏమీతెలియని వారము. ఐనా నిన్ను సేవించుకోవాలనెడి ఉత్సుకతతో ఏదేదో చేసేశాము. నిన్ను మాశక్తి కొలదీ సేవించాలన్న తపనేకానీ మరే ఆర్భాటమూ నాపూజకు కారణం కాదు తల్లీ!" అని వేడుకుంటున్నాము. మన ఇంటికి వచ్చిన మనకు అత్యంత ప్రీతి పాత్రమైన వ్యక్తి ఇంటి నుండి వెళుతుంటే ఏవిధంగా మాట్లాడతామో అలాగే ఉంది కదా!? ఎంత వినయం,విధేయతా ఉంటే ఈ మాటలు అనగలుగుతాము? అందుకే పూజ చేయడం సరిగా వస్తే " సాటి మనిషితో ఎలా మెలగాలి? ఎలా ప్రేమించాలి? '' అనే విషయం మనకు బాగా తెలిసినట్టే!